ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలానుబద్ధము.

# ప్రదర్శకాభిభాషణము.

ఇది

చెన్నపురి ఆయుర్వేదకలాశాల ప్రిన్సిపాలును

అఖిలభారతాయుర్వేద విద్యాపీఠమున కధ్యక్షులునునగు

శ్రీమాన్,

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి, ఏ. వి. యస్., వారిచే

అఖిలభారతరాష్ట్రమాయుర్వేద మహాసమ్మేళనానుబద్ధమగు

ఆయుర్వేద మహావస్తుప్రదర్శనమున

పూనాలో (25-2-17) నొసగబడిన

యధ్యక్షోపన్యాసము.

చెన్నపురి:

౧౯౧౭ సం॥





శ్రీః

అఖిలభారతాష్టమాయుర్వేద వైద్యమహాసమ్మేళనా

(25 - 2 - 17. పూనా) ను బంధమగు

అఖిలభారతాయుర్వేద మహావస్తుప్రదర్శనోపక్రమణమున

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి ఏ. వి. యస్. వారిచే నొసగబడిన

# అ భి భా ష ణ ము.

శ్రీ శ్రీ జగద్గురువిరూపాక్ష శంకరాచార్యమహాస్వామిన్!

ప్రియవైద్యసోదరులారా! నారీమతల్లికలారా!

వి ద్వ ద్వై ద్య ప్ర కాం డు లా రా!

ఈ పూనాపత్తనమున జరుగబోవు నిఖిలభారతవర్షీయాష్టమాయుర్వేద వైద్యమహాసమ్మేళనానుబంధమగు ఆయుర్వేద వస్తుప్రదర్శనముయొక్క ఉపక్రమణమహోత్సవమును జరుపమని నన్ను స్వాగతకారిణీసభవారు కోరియుండిరి. ఇట్టి గొప్పకార్యమును నిర్వహింప నాకన్న జ్ఞానవయోవృద్ధు లనేకులున్నను మీయవ్యాజకృపావిశేష ప్రేరితుడనై యీ ఘనకార్యమును నిర్వహింపబూనినాడ.

భారతవర్షమున కొలదికాలమునుండి సకలజాతులును సర్వసంఘములును వారివారి జాత్యున్నతిని వృత్తులయభి

వృద్ధిని వాఙ్మయాభివృద్ధినికోరి వానిని పెంపొందింప నుత్సుకులై ప్రతివత్సరమున నొక్కెడ సంఘము జేరి తత్తదభివర్ధకములగు విషయముల పలుదెరంగుల జర్చించి నిర్ణయింపుచు నుతికెక్కుచున్నారు.

“ఆచార్యస్సర్వచేష్టాసు లోక ఏవ హి ధీమతః” అను వాగ్భటోక్తిననుసరించి యాయుర్వేద వేత్తలుగూడ నుత్సాహపూరితులై య్యాయుర్వేదాభివృద్ధికై తదభివర్ధకములగు కృత్యములయందు యత్నముల సలుపుచున్నారు. భారతభూభాగమున ననేక ప్రదేశములయందు ఆయుర్వేద కలాశాలలును, ఆయుర్వేద ధర్మవైద్యశాలలును నెలకొల్పబడినవి. కొందరు ప్రాచీనాయుర్వేదీయ గ్రన్థముల బ్రచురింపుచున్నారు. మరి కొందరు ప్రాచీనగ్రన్థములను దేశభాషలలో పరివర్తనమొనరించి ప్రచారమునకు దెచ్చుచున్నారు. ఆఙ్గ్లవైద్యవిద్యానిపుణులగు కొందరు అట్టి ప్రాచీనాయుర్వేద గ్రన్థములను పాశ్చాత్యవైద్యవిద్యాపద్ధతుల ననుసరించి మార్చుచు కొన్నిగ్రంథరాజముల బ్రకటింపుచున్నారు. కొందరు సిద్ధౌషధములని ఖ్యాతిగాంచిన యాయుర్వేదీయౌషధములను సిద్ధపరచి ప్రజోపయోగము నందింపుచున్నారు. కొందరాయుర్వేద వైద్యసమ్మేళనవిద్యాపీఠములచే నభివృద్ధి జేయుచున్నారు. ఇత్తెరంగున పలుదేశముల పరిపరివిధములుగ నాయుర్వేదాభివృద్ధికై పాటు పడుచున్నారు. పైజెప్పిన కృత్యములు కొన్నివత్సరములవరకు జరిగినగాని యిందిట్టిమహిమలుగలవని జనులకు బోధపడజా

లదు. దేశీయవైద్యు లింతకన్న నెక్కువపూనికతో పనుల జేయ వలసియున్నది.

—॥ విజ్ఞానము - దానిభేదములు. ॥—

లోకమున విజ్ఞానము విద్యలనియు కలలనియు రెండు భేదములు గల్గియుండును. అందు మొదటివి వాఙ్మయాధీనములు. రెండవవి వాఙ్మయాభివృద్ధిని పారిశ్రామికాభివృద్ధిని వస్తుప్రదర్శనములను ఆశ్రయించియుండును. ఆయుర్వేదవిజ్ఞానము రెండవదియగు కలలలో జేరినది. దీనియభివృద్ధికి రసశాలల నెడు కర్మాగారములును వస్తుప్రదర్శనశాలలును అవశ్యకములు.

—॥ ఆయుర్వేదకలలు. ॥—

సుప్రసిద్ధ నీతిశాస్త్రకోవిదుడగు శుక్రాచార్యులు తన గ్రన్థమున చతుష్షష్టికలల విభజించి నిరూపించుచు నాయుర్వేదమునకు జేరిన కలలు పదియని తెలిపిరి.

“ పాషాణధాత్వాదిద్రుతిః తద్భస్మీకరణం కలా ! ధాత్వోషధీనాం సంయోగ క్రియాజ్ఞానం కలా స్మృతా। ధాతుసాఙ్కర్య పార్థక్యకరణం తు కలా స్మృతా । సంయోగపూర్వవిజ్ఞానం ధాత్వాదీనాం కలా స్మృతా । క్షారనిష్కాసనజ్ఞానం కలాసంజ్ఞం తు తత్స్మృతమ్ ” అని కొన్ని కలలను వివరించియున్నాడు.

మరియు వాత్స్యాయనమహర్షి విరచితములగు కామసూత్రములయందు “ సువర్ణరత్నపరీక్షా, మణిరాగకర జ్ఞానం, ధాతువాదః ” ఇవిమున్నగు సూత్రములచే వైద్యమునకు జేరిన

కలలు నిరూపింపబడియున్నవి. ఇట్టి యనేకప్రమాణములచే నాయుర్వేదము కలలలో జేరినదనుట నిర్వివాదము. మరియు నిందువాడబడు ఔషధముల నిర్మాణము కలాన్తర్భూతమని లోకవిదితము. అట్టి కలాన్తర్గతమగు నీయాయుర్వేదము తర్క వ్యాకరణాది శాస్త్రములవలె పాఠమాత్రముననే సార్థకము గాక యీశాస్త్రమునజెప్పిన విషయములనన్నిటిని యథోక్తముగ చేతజేసి చేయబడినవానిని ప్రాణులకుపయోగపరిచి వాని ఫలితమును దెలిసికొనినగాని సంపూర్ణప్రయోజనము నొందదు. లక్ష్యలక్షణ విశిష్టమగు నీయాయుర్వేదమును పరిశోధనలచే ప్రాచీను లభివృద్ధినొందించుచుండి రనుటకు పెక్కు దృష్టాన్తములుగలవు.

## రసశాల.

సర్వౌషధులసంపాదింపనర్హమై రమ్యముగనుండు ప్రదేశమున రసశాలనునిర్మించవలెను. అయ్యది ప్రాగ్దిశయందైనను ఉదగ్దిశయందైనను ఈశాన్యముననైనను మంచిప్రాకారములును మంచిబావియుకల్గి పరస్పరబాధకములుగాని విభాగములతోగూడి యుండవలెను.

## రసశాలయందు పదార్థస్థాపనము.

అట్టి రసశాలయందు తూర్పున రసము మొదలగు ఖనిముల నుంచవలెను. ఆగ్నిదిశయందు పుటకర్మలును, దక్షిణమున పాషాణకర్మలును, నైరృతిభాగమున శస్త్రకర్మలును,

పశ్చిమమున క్షాళనకృత్యములును, వాయుదిశయందు ఎండ బెట్టుపనులును, ఉత్తరమున వేధనకర్మలును, జరుగునట్లు నియమించవలెను. ఈశాన్యమున సిద్ధౌషధముల నుంచవలెను. మరియు నీయౌషధముల జేయుసాధనములగు నాలికాయంత్రము, సోమనాలయంత్రము, వాలుకాయంత్రము, విద్యాధరయంత్రము, గోస్తనమూష, అంధమూష, భస్త్రిక, కోష్ఠి, సత్వపాతన కోష్ఠి, చాలని, ఖల్వము మున్నగువానిని, కషాయద్రవ్యములను, తైలాదిద్రవ్యములను, ప్రాణిజఉద్భిజ్జఖనిజరూపములగు నాయా పదార్థములను సిద్ధపరచియుంచవలెను. ఇట్టి రసశాలానిర్మాణ విధానమంతయు రసరత్నసముచ్చయమున్నగు రసతంత్రములయందు జెప్పబడియున్నది.

## —॥ పరిశోధనములు. ॥—

ఇక్కాలపువారగు పాశ్చాత్యపండితులు పదార్థతత్వముల స్వయముగ జక్కగ బరిశోధించి పరిశోధితవిషయములను సిద్ధాన్తము జేసి వెల్లడిచేయుచుండుట లోకవిదితము. అట్లులనే ప్రాచీనవైద్యాచార్యులును ప్రతివిషయమును స్వయముగ బరిశోధించి సిద్ధాన్తపరచి వానిని తమగ్రన్థముల ప్రకటించిరనుటకు పెక్కుదృష్టాన్తములు కలవు. ఎట్టులన:—"స్వహస్తేన కృతం సమ్యక్ జారణం న శ్రుతం మయా" "స్వహస్తభవయోగేన కృతం సమ్యక్ శ్రుతేనహి" "ధాతుబన్ధస్త్రుతీయోఽసౌ స్వహస్తేన కృతో మయా" "దృష్టప్రత్యయయోగోఽయం కథితో

న్నాత్ర సంశయః" అని రసార్ణవమునను, "యద్వద్గురుముఖాత్ జ్ఞాతం స్వానుభూతంచయన్మయా । తత్తు లోకహితార్థాయప్రక టీక్రియ తేఽధునా" అని రసరత్నాకరమునను జెప్పియున్నది. పైవాక్యముల పఠికించిచూడ మన ప్రాచీనార్యవైద్యులు ప్రతి విషయమును వారు స్వయముగ బరిశోధించుచు దానం గల్గు ఫలితమును నిశ్చితముగ గ్రన్థముల వెల్లడి జేయుచున్నట్లు స్పష్ట ముగ దెలియుచున్నది.

## —॥ సిద్ధౌషధపరీక్షావిధానము. ॥—

భస్మమునైనను సిందూరమునైనను చిటికెతో బట్టినచో నాచిటికెలోనుండు ఔషధము వ్రేళ్లలోగలరేఖలచే నంకితమై యుండుటయు జలమునవైచినచో నీటమునుంగక పైన తేలుట యు పంచమిత్రసంయోగమున మరల తన స్వస్వరూపము నంద కుండుటయు మొదలగు లక్షణములచే నౌషధములు పక్వములై నట్లు కనిపెట్టుచుండిరని యాయుర్వేదవేత్తలకు దెలిసినదియే.

మరియు లోహాదిసంయోగముచే జేయబడి సిద్ధములైన లోహసిందూరము వసన్తకుసుమాకరము మొదలగు దివ్యౌ షధములను వర్ణమునుండియు దానిని నిప్పునవైచినప్పుడు కల్గు ధూమవర్ణమునుండియు ఘర్షణభారమునుండియు పరీక్షించు చుండిరి. ఈవిషయము కేళదిబసవభూపాలవిరచితమగు శివ తత్వరత్నాకరమున నీరీతి జెప్పబడెను. "రసౌషధాని సర్వాణి త్వగ్నిమధ్యే వినిక్షిపేత్ । కిఞ్చిద్గన్ధం ధూమయుక్తం రసయుక్తం

సుపాచితమ్ । న జ్ఞాయతే గన్ధరసం ఉతిపాకము నౌషధమ్ । వల్మీక శిఖరాకారం భగ్నే నీలోత్పలద్యుతి । ఘర్షణే రక్తవర్ణం స్యాత్ సిన్దూరం తత్ప్రశస్యతే । చామ్పేయకుసుమాభాసం తద్గన్ధేన చ సంయుతమ్ । లఘు వారితరం శ్లక్ష్ణం వసన్తకుసుమాకరమ్ । బృహతీకుసుమాకారం లఘు వారితరం గురు । ఘర్షణే కృష్ణ వర్ణం స్యాత్ తన్మృగాఙ్కస్య లక్షణమ్" ఈశ్లోకములచే చంద్రోదయము భూపతి మున్నగు నౌషధముల బరీక్షించు విధానము దెలుపబడినది.

—( లోహద్రవశంఖద్రవాదిపరీక్ష. )—

మరియు ద్రవరూపములుగనుండు లోహద్రవము శంఖ ద్రవము మున్నగు నౌషధములశక్తిని పరీక్షించుమార్గము లీవిధముగ జూపబడెను.—"లోహసూచీం సమాదాయ లోహ ద్రావే వినిక్షిపేత్ । తత్క్షణాత్ ద్రవతాం యాతి సా సూచీనా త్ర సంశయః। తామ్రద్రావే తథా సూచీం సన్ధిభేదీం వినిక్షిపేత్। సూచీద్రావో యామమాత్రాత్ భవత్యేవ న సంశయః । శఙ్ఖ ద్రావే శఙ్ఖసూచీ చతుర్యామేన సంద్రవేత్ । ఏవం పరీక్షాం కృత్వాదౌ ప్రయోగానాచరేద్ధ్రువమ్" ఇది సువర్ణతన్త్రము నందలి ద్వితీయకల్పమున జెప్పబడినది.

పైజెప్పిన పరీక్షణోపాయములుగాక తైలములు లేహ్య ములు ఘృతములు మున్నగువాని పక్వాపక్వపరిజ్ఞానోపాయ ములు ఆత్రేయ భేషజకల్పాదిగ్రన్థములయందు బోధింపబడినవి.

—( విమర్శకసభలు. )—

ప్రాచీనార్యులు పైజెప్పినరీతిగ రసశాలయం దౌషధ పరిశోధనముల సలిపినదియేకాక మహావైద్యపరిషదముల జేర్చి యందు పలుదెరంగులగు విషయములను చర్చాపూర్వకముగ విమర్శించియున్నారనుటకు పెక్కుదృష్టాన్తములుగలవు. పురాతనకాలమున ఆత్రేయుడు పూర్ణాక్షుడు కాంకాయనుడు బాహ్లీకుడు నిమిమొదలగు కొందరుమహర్షులొక్కెడసభ జేరి యందు ద్రవ్యసామాన్యనిష్ఠరసమునుగూర్చి వారివారికి దోచిన యభిప్రాయముల సూచింపుచు సహేతుకముగ నన్నిపక్షముల విమర్శించి రసము లారువిధములని సిద్ధాన్తముజేసినట్లు చరకమునందలి భద్రకాప్యీయాధ్యాయముచే దెలియుచున్నది.

మరియు 814 క్రీస్తవశతాబ్దమున రాష్ట్రకూటవంశమునకుజేరిన కులోత్తుంగచోళుని యాస్థానమున విద్వద్వైద్యుడగు నుగ్రాదిత్యాచార్యులు మాంసాశన ముచితముగాదని నిరూపించుటకై కుంభదన్త హస్తచారి మున్నగువారిని నలువదిమందిని ప్రధానముగనునిచి యొకవైద్యమహాసభను నిర్ణయించి అందు చర్చించినట్లు తనచే రచియింపబడిన కల్యాణకారకమునంగల యీక్రిందిశ్లోకముచే దెలియుచున్నది. "ఖ్యాతశ్శ్రీనృపతుఙ్గవల్లభమహారాజాధిరాజాస్థితః ప్రోద్యద్భూరిసభాన్తరే బహువిధప్రఖ్యాతవిద్వజ్జనే । మాంసాశిప్రకరేన్ద్రితాఖిలభిషగ్విద్యావిదామగ్రతః మాంసే నిష్ఫలతాం నిరూప్య నితరాం జైనేన్ద్రవైద్యస్థితః"

## —( పదార్థపరిజ్ఞానము. )—

ఆయుర్వేదపదార్థవేత్తలగు ప్రాచీనులు సృజింపబడిన పదార్థములనన్నింటిని ఖనిజములు ప్రాణిజములు ఉద్భిజ్జములు నని మూడువిధముల విభజించిరి. అట్టి త్రివిధవస్తుజాతములో దోషప్రకోపముచే జనించు రోగముల నశింపజేయ సమర్థములగు పదార్థవిశేషములను వారివారి జ్ఞానగరిమచే గనిపెట్టి వానికి భేషజములని పేరిడిరి. అట్టి యోషధిపరిజ్ఞానము దెలుపు నాయుర్వేదభాగము వృక్షాయుర్వేదమని ప్రసిద్ధిజెందినది. అయ్యది యిక్కాలమున విరళప్రచారముగనున్నది. అగ్నిపురాణమునందును కార్ష్ణాదిగ్రన్థములయందును ఇతరవ్యాఖ్యానములయందును వానిస్వరూపము లచ్చటచ్చట కొంచెము గన్పట్టుచున్నవి.

మరియు "గోపాలాః తాపసా వ్యాధాః యేచాన్యే వనచారిణః । మూలాహారాశ్చ యే తేభ్యః భేషజవ్యక్తిరిష్యతే" అనుసుశ్రుతవాక్యమును పరికించిచూడ పూర్వకాలమున మనప్రాచీనులు ప్రమాణవర్ణాకృతినామజాతులచే భిన్నములగు నోషధిసముదయమును ఆవులమేపువారు తాపసులు మున్నగువారిని సహాయముగ జేసికొని సంస్కృతప్రాకృతాది నామభేదముల చేతను స్పర్శనము దర్శనము మున్నగు నుపాయములచేతను పలుమారు విమర్శించి వానిభేదముల గనిపెట్టి నిర్ణయించుచుండిరని తెలియుచున్నది. ఈరీతిగ గుర్తింపబడిన భేషజములను

పలుతడవ లనేకుల కుపయోగించి వానియందుగల రసవీర్యవిపాక ప్రభావగుణాదులచేతను దీపని పాచని గ్రాహి స్రంసని అను లోమని స్తంభని మొదలగు శక్తులచేతను గల్గు త్రిదోషసామ్యమును త్రిదోషజన్యవ్యాధినాశకత్వమును కనిపెట్టిరి.

ఇక్కాలపు రసతన్త్రిశోధకులగు పాశ్చాత్యపదార్థశాస్త్రవిద్వాంసులు ఆల్కలైన్, స్టార్చి, కార్బొనెట్, నైట్రిక్, ప్రొటేడ్స్, ఇవిమున్నగు శక్తులుకలవిగ విభజించి నిరూపించుచున్నారు. పదార్థపరిశోధనములయందు ప్రక్రియా భేదంబును పారిభాషికశబ్దములును భేదములుగానున్నవి. అయినను ఆవస్తువులు జ్వరనాశకత్వము శోషనాశత్వమున్నగు ఫలముల జూపునపుడు రెండుమతములకును భేదముగన్పట్టదు.

మనప్రాచీనులు రసశాలలనుండియు పరిశోధనముల జేయుచుండిరి. అట్టి పరిశోధనశాలలు ప్రకృతకాలమున నెచ్చటను గానరావు. ప్రకృతమున నాచరణమునసుండు పాశ్చాత్యపద్ధతుల ననుసరించియే యాయుర్వేదీయౌషధములను వివరముగ పరిశోధింపవలసియున్నది. మనము ఏశాస్త్రపద్ధతినైన నవలంబించి పదార్థముల పరిశోధించుట మనలకావశ్యకముగాని అయ్యది పాశ్చాత్యపద్ధతియైనను లేక ఆయుర్వేదీయపద్ధతియైనను మనకు దోషావహముకాదు. మనము కార్యానుకూలమునందు దృష్టినుంచవలెగాని పద్ధతియేదైననేమి?

మఱియు చరకాదులయం దుత్తమములని వాడబడు పదార్థముల తత్వము లోకమునదెలియగలదు. గ్రన్థములు

గాక వారివారి వైద్యపరంపరలో నుపదేశముచే ననుశ్రుతముగ ననుభవసిద్ధములై కొన్ని దేశములయందు మాత్రము వాడబడు గొలిమిడి, నానుబాల, ముదరబెండ, బొక్కెన, సముద్రపాల, కానాంజెడి, నెణా, చిన్నియలై, శివనారివేంబు ఇవి మున్నగు ననేకౌషధములు గ్రన్థారూఢములు గాకుండుటంజేసి వారివారి యిండ్లయందు మాత్రము దాగియున్నవి. వానిని పరిశోధించుట యవసరము. ఏకదేశముననుండు నయ్యవి యాడ పరిశోధనములచే గ్రన్థస్థములై సర్వజనసాధారణముగ దెలియదగి యుండును. విజ్ఞానమతిశయించును. ఇట్టి పరిశోధనాగారము లింతవరకును భారతభూభాగమునం దెచ్చటను లేవు. ఆకొరంతను విఖ్యాతులగు బెంగుళూరునందలి తాతాకంపెనీవారు కొంతవరకు తీర్చిరి. ఆపరిశోధనాలయమున దేశీయౌషధులను గూర్చిన పరిశోధనముల జేయదలచిరని తెలిసియుంటిని. ఆకార్యమిచ్చట నెరవేరిన మనమందరును ధన్యులమగుదుము.

—॥ పదార్థములు సందేహాస్పదములు. ॥—

పరంపరాగతమగు పదార్థవిజ్ఞానము లేకపోవుటచే నాయుర్వేదతన్త్రములయందు ప్రతిపాదితములగు త్రివిధవస్తువుల యందును జాత్యాదివిషయకసందేహములుమెండు. ఈవివరమంతయు 1915-వ సంవత్సరమున చెన్నపురిలో నానిరీక్షణము క్రింద జరిగిన యాయుర్వేదవస్తుప్రదర్శన విమర్శనమునందు జూపబడియున్నది. అందు కొన్నిటి నిచ్చట సూచించెద:—రసతన్త్రవిహితములగు మహారససాధారణరసాదిభేదములచే విభాజిత

ములగు ఖనిజములలో వైక్రాన్త రసకములు సందేహాస్పదములు. అఞ్జన విమల చపలములును కంకుష్ఠాగ్ని జారములును అదృశ్యములు. ధన్వన్తర్యాదినిఘంటువులయం దుదాహృతములగు పర్ణీచతుష్టయంబును, ప్రసారిణి బ్రాహ్మి విదారి మొదలగునవియు దేశభేదముచే భిన్న భిన్నములుగ గన్పట్టుచున్నవి. కాకోళ్యాదిద్రవ్యము లదృశ్యములు. ప్రాణిజములలో జేరిన యగ్నిజారముగు లావుకాదులును సందిగ్ధములు. ఇట్టి యనర్థములు కల్గుటకు సంప్రదాయసిద్ధములగు ప్రదర్శనశాలలు లేకపోవుటయే ముఖ్యకారణము.

ఇట్టి సందేహముల దొలగించుటకై మహామణ్డలి ప్రత్యేకోపసంఘము నేర్పరచినది. అయ్యది యింతవరకు నేపనిని తదనుకూలముగ జేసియుండలేదని తోచుచున్నది. ఇంతటనైన స్థిరమగు నొకవస్తుప్రదర్శనాశాల నేర్పరచినక్కాని పైజెప్పిన యనర్థములు నివర్తింపజాలవు.

## — రసశాలల యావశ్యకత. —

ఆయుర్వేదము లక్ష్యలక్షణభూయిష్ఠము. దీనికి సంబంధించి యేకార్యమును జేయవలెనన్నను ప్రాణిజ ఖనిజ ఉద్భిజ్జములగు త్రివిధవస్తువు లావశ్యములు. వానిపరిజ్ఞానము ప్రదర్శనాధీనము. సంశయమును పొరబాటును లేక నిశ్చయింపబడిన పదార్థములు సిద్ధములుగనుండినగాని వైద్యునకే పని జేయ సమర్థతకలుగదు. దానంజేసియే ప్రాచీనాచార్యులును ముష్కందు

ములగు ఖనిజములలో వైక్రాంత రసకములు సందేహాస్పదములు. అజ్ఞన విమల చపలములును కంకుష్ఠాగ్నిజారములును అదృశ్యములు. ధన్వంతర్యాదినిఘంటువులయం దుదాహృతములగు పర్ణీచతుష్టయంబును, ప్రసారిణి బ్రాహ్మి విదారి మొదలగునవియు దేశభేదముచే భిన్నభిన్నములుగ గన్పట్టుచున్నవి. కాకోళ్యాదిద్రవ్యము లదృశ్యములు. ప్రాణిజములలో జేరిన యగ్నిజారముగు లావుకాదులును సందిగ్ధములు. ఇట్టి యనర్థములు కల్గుటకు సంప్రదాయసిద్ధములగు ప్రదర్శనశాలలు లేకపోవుటయే ముఖ్యకారణము.

ఇట్టి సందేహముల దొలగించుటకై మహామణ్డలి ప్రత్యేకోపసంఘము నేర్పరచినది. అయ్యది యింతవరకు నేపనిని తదనుకూలముగ జేసియుండ లేదని తోచుచున్నది. ఇంతటనైన స్థిరమగు నొకవస్తుప్రదర్శనాశాల నేర్పరచినగాని పైజెప్పిన యనర్థములు నివర్తింపజాలవు.

## —( రసశాలల యావశ్యకత. )—

ఆయుర్వేదము లక్ష్యలక్షణభూయిష్ఠము. దీనికి సంబంధించి యేకార్యమును జేయవలెనన్నను ప్రాణిజ ఖనిజ ఉద్భిజ్జములగు త్రివిధవస్తువు లావశ్యములు. వానిపరిజ్ఞానము ప్రదర్శనాధీనము. సంశయమును పొరబాటును లేక నిశ్చయింపబడిన పదార్థములు సిద్ధములుగనుండినగాని వైద్యునకే పనిజేయ సమర్థతకలుగదు. దానంజేసియే ప్రాచీనాచార్యులును ముస్ముందు

సమ్మేళనానుబంధముగ మూడు వస్తుప్రదర్శనములు జరిగినవి. కీని నుండి యనేకులకుగల సందేహములనన్నిటిని నివర్తి జేసికొను టకు వీలులేకున్నది. ఇందుకు వస్తుప్రదర్శనాకాలము బాహుళ్య ముగ లేక 20-30 దినములకు లోపుగనుండుటయే ముఖ్యకార ణము. ఇట్టిప్రదర్శనములు చిరకాలస్థాయిగనున్న గాని వైద్యుల సందేహములన్నియు జక్కగ బోజాలవు. ప్రదర్శనములు స్థిర ముగ నుండవలెనన్న నధికద్రవ్యమావశ్యకము. ఈద్రవ్యసా హాయ్యమునకై మనదేశపుసంస్థానాధిపతులు ప్రార్థితులైయు న్నారు. ఇట్టికార్యములను స్థిరములుగనిలుపుటకై పాలకసంఘ ము వారి సాహాయ్య మవశ్యముగ నపేక్షితము. పైజెప్పినవిధ ముగ వస్తుప్రదర్శనాలయమును స్థిరముగ నెలకొల్పి తదనుబంధ ముగ నోషధిప్రస్థమును నెలకొల్పవలెను. అందు వివిధదేశముల నుండు నోషధిజాలమునెల్ల సిద్ధము జేయవలెను. దీనికి దగుప్రయ త్నముల జేయుట మనయుద్యమములలో ప్రధానమైయున్నది.

మనదొరతనమువారు పలుదేశములయందు చిత్రవస్తు ప్రదర్శనాలయముల స్థాపించియున్నారు. అయ్యవి కేవలము ప్రాచీనవస్తుజాతముతోడను శిల్పములుమున్నగు ద్రవ్యసముదా యముతోడను గూడియున్నవి. వానిని-మనము జూచునప్పుడు మనకెట్టియాహ్లాదము జనించునో నేచెప్పజాలను. ఆరీతిగనే నానావిధ వస్తుపరిపూర్ణమగు నాయుర్వేదవస్తుప్రదర్శన శాల లను మనము జూచినచో మనకెంతటి యాహ్లాదము జనించునో

దానం జేసి మనపరిశోధనములను విమర్శనములను నెంతయభి వృద్ధినందింపగల్గుదుమో విజ్ఞులెల్ల తిలకింపుడు.

—( పాశ్చాత్యపరిశోధనల ఫలితము. )—

ప్రకృతమున పాశ్చాత్యవైద్యపుంగవులు వస్తుప్రదర్శన శాల రసశాలలనుండియేకదా పరిశోధకాగ్రగణ్యులని నుతికెక్కియున్నారు. వీరిపరిశోధనల నుండియేకదా ప్రపంచమున నవీనములగు పెక్కు శాస్త్రీయవిషయములు వ్యాపించియున్నవి. వ్యాపారాభివృద్ధికి పరిశోధనములే కదామూలములు. ఇట్టి పరిశోధనములు పదార్థజ్ఞానమునుండియేకదా జరుగగలవు. అట్టి పదార్థజ్ఞానము వస్తుప్రదర్శనముల నవశ్యముగ నపేక్షించుచున్నది. అట్టిపదార్థములే మనభేషజాది క్రియాకలాపమున కంతటికిని మూలములు. మనకట్టిపదార్థజ్ఞానము లేకపోవుటచే ప్రతివత్సరమునను ఏబదితొమ్మిదిలక్షల డెబ్బదివేల యెనిమిది వందల యెనుబదియైదు (59,70,885) రూపాయల వెలగల ఖనిజములు మొదలగు భేషజవస్తుజాలము మన భరతఖండమునుండి ద్వీపాంతరముల కేగుచున్నది. ఆభేషజద్రవ్యములు ద్వీపాన్తరవాసముచే నౌషధరూపములనంది దాదాపుగ నొకకోటిరెండు లక్షలకొప్పములవెలగల్గి (10199085) మరల వానికి జన్మభూమియగు మనభారతభూమికి వచ్చుచున్నవి.

పైగనబరచిన విషయమంతయు భారతసామ్రాజ్య పరిపాలకులచే 1915 వత్సరమున ప్రకటితమగు నీ నివేదనము (బ్లూబుక్) వలన దెలియుచున్నది.



19[illegible]5 నివేదిక    ఎగుమతులు

| | | బి. | ఇ. |
|---|---|---|---|
| [illegible]యా కెమికల్సు | పౌ. | 280821 | 19506 |

| | | బి. | ఇ. |
|---|---|---|---|
| పటిక | పౌ. | 42 | 11 |
| ఆర్సనిక్ (పాషాణము) | ,, | 283 | ... |
| పొటాసియా కాంపౌండ్సు | ,, | 267248 | 18327 |
| ఇతరములు | ,, | 872 | ... |
| సోడా కాంపౌండ్సు | ,, | 6049 | 142 |
| ఇతరములు | ,, | 66 | 177 |
| ఇతర కెమికల్సు | ,, | 6261 | 849 |
| మొత్తం | ,, | 280821 | 19506 |

| | | బి. | ఇ. |
|---|---|---|---|
| డ్రగ్సు - మినరల్సు | ...... | 73422 | 24810 |

| | | బి. | ఇ. |
|---|---|---|---|
| కలుబంద | పౌ. | 252 | 10 |
| ఇంగువ | ,, | 147 | 27 |
| కర్పూరము | ,, | 14 | ... |
| సింకోనా | ,, | 9567 | ... |
| గలాన్ గాక్ | ,, | 28 | 276 |
| సెకాన్స్వమికా | ,, | 6173 | 8883 |
| సెన్నా - సునాముఖి | ,, | 10411 | 8154 |
| (అదర్సు) ఇతరములగు మందులు - ఘూలికలు | | 46835 | 7460 |
| | | 73422 | 24810 |

మొత్తము... 354243 + 48816

వెరశి మొత్తము... 398059 పౌనులు

అనగా 59,70885 రూపాయిలు



1915 సం|| భారతసామ్రాజ్య నివేదిక: దిగుమతులు

| డ్రగ్సు - మెడిసెన్సు. | | | బి. | ఇం|ఫ్రీటెస్సు. |
|---|---|---|---|---|
| మూలికలు - మందులు. | ఇంగువ. | పౌ. | 100 | 19955 |
| | కర్పూరము | ,, | 10005 | 111821 |
| | కాష్యానిగ్స | ,, | 28007 | 27408 |
| | కొకెయిన్ | ,, | 494 | 34 |
| | * పేటెంటు మెడిసెన్సు | ,, | 99626 | 26663 |
| | క్వైనైన్ | ,, | 65929 | 19249 |
| | సారసపరిల్లా | ,, | 1386 | ... |
| | షారాక్సు (మడ్డిపాలువగైరా) | | 5 | 1572 |
| అదర్ మెడిసన్సు (ఇతరమందులు.) | | ,, | 202781 | 64904 |
| | | మొత్తము... | 408333 | + 271606 |
| | | వెరశి మొత్తము... | 679939 | పౌనులు |

అనగా

దిగుమతుల మొత్తము సొమ్ము ...101,99085 రూపాయలు

ఇందు ఎగుమతుల మొత్తము ... 5970885 ,, పోగా

మిగత ... ... 4228200 ఈమొత్తమంత యు భరతఖండ మునకు నష్టమగు చున్నది.

* ఇందు పేటెంటుమందులుమాత్రము దాదాపు 1894335 రూపాయలమొత్తము గలిగినవిగ దెలియుచున్నవి.

ఔషధోపయోగములగు బంగారు వెండి సీసము మొదలగు లోహములును, పాదరసము మొద లగునవియు నిందు గనుపరుపబడిన పట్టికలో జేర్పబడలేదు.

కర్ణసన్తాపజనకమగు పైపట్టికయందగుబరచిన నష్టవిషయమును విన్నచో నెవరికి మనమున విషాదము పొడసూపకుండును? అస్మద్దేశీయవైద్యనిపుణులకు పదార్థతత్వజ్ఞానంబును తత్ జ్ఞానసాధనములగు పారిశ్రామికకర్మాగారంబులును సంపూర్ణముగనున్నచో మనభారతభూజననికి పైజెప్పిన నష్టము కలుగకయు దానంజేసి మనము కష్టముల ననుభవింపకయు సుఖముగ నుందుముకదా?

ఆయుర్వేదీయౌషధముల కావశ్యకములగు ద్రవ్యజాతమంతయు మనభరతఖండముననే దొరకగలవు. వానిసంపాదించుటకై యేద్వీపాన్తరమునకును పోబనిలేదు. ఎట్టికష్టములు కల్గినను వానిని సంపాదింప నసాధ్యత కలుగజాలదు.

మనభారతమున మనతో సమానముగ జనించిన ద్రవ్యములు మనకుదెలియక యేద్వీపాన్తరమునకేగియౌషధరూపము దాల్చివచ్చుచున్నవి. పైజెప్పిన దుర్గతుల కన్నింటికిని మన యజ్ఞానంబును మనయౌదాసీన్యంబును మనకును మనవిద్యలకును తగినంత రాజావలంబనము లేకపోవుటయు ముఖ్యకారణములని వగచుచున్నాడను.

పైగనుపరచిన సంఖ్యలనుండి మనదేశమున నుత్పన్నములగు పదార్థములను తత్తదుచితముగ నుపయోగపరచుశక్తి మనకు లేదని యొప్పుకొనక తప్పదు. మనతోడివారెల్ల కా

కష్టముల నెరుంగక పరిశోధనముల జరిపి ప్రపంచమున నవీన విషయముల వెదజల్లుచున్నారు.

మన మహర్షులు కేవలము ప్రపంచోపయోగమునకై కనుగొనిన విషయములను విజ్ఞానమును ఆర్యసంతతిని జనించిన మనము చెవినిబెట్టకయు కన్నులజూడకయు నిరాదరముగ నున్నారము.

ఇంకనైన మనమెల్లరును బద్ధదీక్షులై యాయుర్వేదాభి వర్ధకములగు కృత్యము లన్నింటియందును జాగరూకతవహించి వారివారిశక్తికొలది ప్రతివిషయమునను ప్రయత్నముల సలుప వలెను.

అందు ఆయుర్వేదవస్తుప్రదర్శనాలయమును స్థిరముగ నెలకొల్పుటకును తదనుబంధముగ నోషధిప్రస్థమును గల్పించుటకును శీఘ్రముగ యత్నముసలుపుట ప్రధానకృత్యము. మఱియు నాయుర్వేదీయ వస్తుజాతమును వివరముగ విభజించి ఆయాపదార్థ నిష్ఠములగుగుణవిశేషములను సవిమర్శముగ నిర్ణయించిప్రకటనజేయవలెను. చరకాదులయందు నిరూపితములగు నోషధులను వానివానిస్వరూపముల బోధించు నైజమగు చిత్ర వర్ణప్రతిమలతోగూడ ముద్రించి ప్రకటన జేయవలెను. వాని స్వరూపాదులనన్నింటి నందు నిరూపింపవలెను. దేశభేదముచే గల్గు వానినామభేదముల సూచింపవలెను. ఇట్టిగ్రంథములు పైజెప్పిన సందేహముల నన్నింటిని మాన్పగలవు. ఇట్టి పుస్తకముల

నింతకుమున్ను మనదేశీయవైద్యులు కొందరు ముద్రింప నారభించిరిగాని అయ్యవి యొకటి రెండు సంచికలతోడనే యస్తమించినవి. జ్ఞానవయోవృద్ధులును ఆయుర్వేదాంగ్లవైద్యవిద్యాధురీణులును లోకబాంధవులునగు శ్రీమాన్ కర్నల్ కీర్తికర్ గారు "పాయిజన్ డ్రగ్స్ ఆఫ్ బొంబై" (బొంబాయియందలి విషవస్తువులు)అను పుస్తకమును స్వవర్ణస్వస్వరూపాదుల బోధించెడి చిత్రవర్ణప్రతిమలతోగూడ ముద్రించియున్నారు.

మఱియు కర్నల్ కీర్తికర్ గారును మేజర్ బి. డి. బోస్ గారును భారతీయౌషధుల స్వరూపాదులబోధించు చిత్రముల నిర్మించి వానిస్వరూపగుణాదుల బోధించుచు నొకగ్రన్థమును రచించి ముద్రించుచున్నారని తెలియుచున్నది. ఈగ్రన్థము ఆంగ్లభాషామయమైనను ఆయుర్వేదమునకు మహోపకారమును జేయగలదని నమ్ముచున్నాను.

ప్రకృతమున నీప్రదర్శనాలయమున సేతుశీతాచలమధ్యదేశము నుండియు ఆయుర్వేదీయ వస్తుసముదయమును రావించియుంచియున్నదని ప్రదర్శనపు సూప్రెంటుగారగు ఆయుర్వేదపంచానన కృష్ణశాస్త్రికవడే, బి. ఏ. గారి నివేదికనుండి తెలియుచున్నది. ఇందలి వివిధభాగములును వానిపరిస్థితులును ప్రదర్శనోపసంఘమువారు మిక్కిలి శ్రద్ధతోడను ఆసక్తితోడ, అభిమానముతోడను జేసియున్నారని తలచెదను. ఈవస్తుప్రదర్శనము కేవలమాయుర్వేదవైద్యులకేగాక యందరకును వ్యా

వారి మనంబునంగల సందేహములబాపి యుపకరింపగలదు. దీనం జేసి చూచువారలకందరకును విజ్ఞానమధికమగుటకు సందియము లేదు. ఆయుర్వేదప్రచారమునకు ప్రధానాధారభూతమగు నఖిలభారతాష్ట మాయుర్వేద మహాసమ్మేళనానుబంధమగు నీయాయుర్వేద వస్తుప్రదర్శనమును సర్వప్రాణులకును ఆరోగ్యభాగ్యసుఖంబుల నొసంగు ననాదివైద్యుండగు ధన్వన్తరిని స్తుతియించుచు బహిరంగము జేయుచున్నాడను.

ఓమ్ తత్సత్.



## శాశ్వతపు చందాదారులు ఆచరించవలసిన నియమములు.

మా గ్రంథమాలయందలి గ్రంథములు ప్రతి ఆంధ్రునకును ప్రతి ఆంధ్ర దేశపు వైద్యునకును ఇతరవైద్యులకును మిక్కిలి యుపయోగమగునట్లు తక్కువ వెలల కీయదలచినారము.

మా గ్రంథములన్నియు చవుకగా కావలయునేని మా గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులగుటయే యుత్తమము. శాశ్వత చందాదారులగువారు మొదట చందాధనము నీయనక్కరలేదు.

తాము సంతకము జేసిపంపిన దరఖాస్తు అందగనే ఇదివరకు ప్రకటింపంబడిన గ్రంథములలో నిలవయున్న గ్రంథములన్నియు తమకు వి. పి. గా పంపబడును. తరువాత ముద్రింపంబడు క్రొత్తగ్రంథములు ఎప్పటికపుడు వి. పి. గా పంపబడుచుండును.

చందాదారులగువారిని మేముపంపిన వి. పి. లు తిరుగగొట్టకుండగలందులకు నెక్కువగ ప్రార్థించెదము. అట్లు తిరుగగొట్టినవారివద్దనుండి గ్రంథముల పూరావెలలును మాకగు నష్టమును క్రమముగ రాబట్టుకొనబడును.

కొందరివలె మున్ముందుగ పోషకులవద్దనుండియు చందాదారులవద్దనుండియు ద్రవ్యమును స్వీకరించి ఒకటిరెండు సంచికలను మాత్రము యిచ్చుటనో ముద్రించి బంపియో లేక బంపకయోయుండు గ్రంథమాలలవలె గాక మా గ్రంథమాలయందలి గ్రంథములను ఆంధ్రసోదరుల సౌకర్యమునకై విశేషమగు మూలధనముతో స్వకీయమగు ముద్రణాలయము నేర్పరచుకొని అధికధనవ్యయముతో పుస్తకములను ముద్రించి ముద్రణము పూర్తియైనతోడనే దెలిపి వి. పి. మూలకముగ పంపుచున్నారము.

శాశ్వతచందాదారులుగ నుండగోరువారు ముందుగ ప్రవేశరుసుము క్రింద రెండు అణాలు పోస్టుబిళ్లలను పంపుకొనవలెను. శాశ్వత చందాదారులుగానున్న వారికి మాగ్రంథమాలయందలి గ్రంథములన్నిటికిని నియమితములగు ఖరీదులో రూపాయికి నాలుగణాలు తగ్గించి యివ్వబడును. చక్కనికాకితములు చక్కని అచ్చు మనోహరమగు బైండుతోజేరిన ఆయుర్వేద వైద్యశాస్త్రగ్రంథములు ఇంతకన్న తక్కువవెలల కిచ్చువారు ఆంధ్రదేశమునందెచ్చటను లేరని జెప్పగలము.

మ్యానేజర్, ఆయుర్వేదాశ్రమగ్రంథమాలా ఆఫీస్,

**55**, ఆచారప్పన్ వీధి, జి. టి. మదరాస్.

శ్రీమద్ధన్వన్తరయేనమః

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

శ్రీమాన్, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఏ. వి. ఎస్., ఏ. ఎం. బి. వారిచే సంప్రదాయానుసారముగ

నాంధ్రభాషయందు వ్రాయబడి ముద్రితములై క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

☞ * శాశ్వత చందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగత పుస్తకములు 100-కి 25-రూ॥ తగ్గించి ఇవ్వబడును.

1. మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్రవ్యాఖ్యాయుతము రోగనిదానాదు లందెలుపు గొప్పవైద్యగ్రంథము వెల ... ... 3 0 0
2. అర్కప్రకాశము - ప్రతిమూలికనుండియు "అరఖుల" దీయుట కుపాయము లను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుస రించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడి యున్నది. వెల ... ... 2 0 0
3. ఆయుర్వేదపరిభాష - అనేకగొప్ప ఆయుర్వేద గ్రంథములనుండి సంగ్రహింప బడినది. సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయు వారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... 1 8 0
4. రసప్రదీపిక - రసతంత్రప్రక్రియలను బోధించు సుప్రసిద్ధమైన తెనుగు పద్య కావ్యము రసార్ణవాది గ్రంథముల సహాయముచే తేటతెనుగున తాత్పర్యము వ్రాయబడినది. ఇందు తెలుపబడియుండు లోహాదిధాతువులకు ఇంగ్లీషు పేర్లు చూపబడియున్నవి. వెల ... ... 1 8 0
5. పథ్యాపథ్యము - సంస్కృతము. విశదమగు తెనుగుతాత్పర్యము వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను దెలుపును. వెల... 1 0 0
6. భేషజకల్పము - వైద్యప్రక్రియలను తెలుపు సుప్రసిద్ధ ఆంధ్రపద్యకావ్యము అతి విపులమగు నాంధ్రవ్యాఖ్యానము కలదు వైద్యులుమాత్రమేగాక ప్రతి యాంధ్రుడును చూడతగిన యుత్తమగ్రంథము. వెల ... 1 0 0

* ఇంతవరకు ముద్రితములును నికమీద ముద్రింపంబోవు గ్రంథముల నన్నిటిని గ్రహించువారు శాశ్వతచందాదారులుగ నెన్నబడుదురు.

24 – 31

7. దక్షిణభారతము ఆయుర్వేదప్రచారము వెల ... ... 0 8 0

8. అధ్యక్షకాభిభాషణములు – "బొంబాయి" "కొల్లంగోడు" లలో జరిగిన ఆయుర్వేద వైద్యమహాసమ్మేళనమునయిచ్చిన ప్రధానోపన్యాసములు. ఇందు ఆయుర్వేద వైద్యక విషయములును అందలి గ్రన్థములును ఆయాదేశముల యందు వైద్యాభివృద్ధియును రాజకీయ వైద్యకశాసనమును విపులముగ విమర్శింపబడినవి. ... ... ... 0 6 0

9. హిందూవిశ్వవిద్యాలయము-గడచిన నూరుసంవత్సరముల కాలములోని వైద్యాభివృద్ధి. ఇది లెఫ్టనెంటుకర్నల్ కే. ఆర్. కీర్తికర్. ఎఫ్. ఎల్. యస్. ఐ. ఎం. ఎస్. (రిటైర్డు) గారిచే నాంగ్లభాషయందు వ్రాయబడినదానికి ఆంధ్రమున పరివర్తితము. ఈగ్రంథనామముచేతనే యిందలివిషయములు సర్వజనబోధములు. వెల ... ... ... 0 6 0

10. హిందూవిశ్వవిద్యాలయము – ఆయుర్వేదప్రశస్తి. ఇది మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్, ఎం. ఏ. ఎల్. యం. ఎస్. గారిచే నాంగ్లభాషయందు వ్రాయబడినది. వెల ... ... ... 0 4 0

11. పైదానికి ఆంధ్రమున పరివర్తితము – ఇందు ఆయుర్వేదము ఆధారరహితమగు శాస్త్రము గాద (Scientific) ని తెలిపి త్రిదోషతత్త్వనిర్ణయము మొదలగు విషయములు చక్కగ విమర్శింపబడినవి. వెల ... 0 6 0

12. అగస్త్యవైద్యము – దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగు వచనము. వెల ... ... ... 0 4 0

13. ఆయుర్వేదాంగశల్యతంత్రము – ఆయుర్వేదమున శస్త్రచికిత్స నెట్లు కనుగొనినదియు దానినభ్యసించు మార్గములను బోధించు తెనుగువచనము. వెల ... 0 4 0

14. వస్తికర్మము – "పిచికారి" యొక్క స్వరూపమును దానినుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెనుగు వచనము. వెల ... ... ... ... 0 4 0

15. ఆయుర్వేదచరిత్రము – ఆయుర్వేదము నందలి విషయములు మొదలగువానిని విపులముగ చర్చించు తెనుగు వచనగ్రంథము. వెల ... 0 4 0

16. ప్రదర్శకాభిభాషణము వెల ... ... ... 0 2 0

17. ఆంధ్రదేశము – వైద్యసహాయము. వెల ... ... 0 1 0

మ్యానేజర్,

టెలిగ్రాఫ్ అడ్రసు, "పండిట్" మదరాస్. } ఆయుర్వేదాశ్రమ గ్రన్థమాలా కార్యాలయము, నెం. 55, ఆచారప్పన్ వీధి, జి. టి. మదరాస్.

చెన్నపురి :

55, ఆచారప్పన్ వీధియందుగల

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులవారి

స్వకీయాయుర్వేద ముద్రాయంత్రమున ముద్రింపబడి

ఆయుర్వేదాశ్రమమున ప్రకటింపంబడియె.

వైద్యశాస్త్రము

గ-8

# ఆంధ్రదేశము - వైద్యసహాయము.



వైద్యరత్న
పండిత్, డి. గోపాలాచార్లు,
ఎ. వి. యస్., ఏ. యం. బి.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు

ఏ. వి. ఎస్., ఎ. ఎం. బి., వారిచే

ఆంధ్రభాషలో వ్రాయబడిన

# ఆ యు ర్వే ద వై ద్య గ్రం థ ము లు.

శాశ్వతచందాదారులకు మాధవనిదానముతప్ప మిగి
పుస్తకములు 100-కి 25-రూ. తగ్గించి ఇవ్వబడును.

| | | |
|---|---|---|
| మాధవనిదానము, | ఆంధ్రవ్యాఖ్యానము. | రు. 3-0 |
| అర్క్రప్రకాశము, | ,, | రు. 2-0 |
| ఆయుర్వేదపరిభాష, | ,, | రు. 1-8 |
| రసప్రదీపిక, | ,, | రు. 1-8 |
| పథ్యాపథ్యము, | ,, | రు. 1-0 |
| భేషజకల్పము, | ,, | రు. 1-0 |
| అధ్యక్షకాభిభాషణములు, | తెనుగువచనము | రు. 0-6 |
| ఆయుర్వేదచరిత్రము, | ,, | రు. 0-4 |
| ఆయుర్వేదాంగశల్యతంత్రము, | ,, | రు. 0-4 |
| అగస్త్యవైద్యము | ,, | రు. 0-4 |
| వస్తికర్మము | ,, | రు. 0-4 |

పోస్టేజి వేరుగా నివ్వవలెను.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలా ఆఫీస్, మదరాస్

---

# ఆంధ్ర దేశము

# వైద్యసహాయము.



ఆంధ్రులు, వారి యారోగ్యము, వైద్యసాహాయ్యము మొదలగునవి ప్రకృతాంశములు. చెన్న రాజధానియందలి కొన్ని జిల్లాలును నైజాము రాజ్యమందలి కొన్ని జిల్లాలును చేరి ఆంధ్రదేశమని వ్యవహరింపఁబడుచున్నది. ప్రకృతము వ్రాయఁబోవు నంశముల నుద్దేశించి గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్లారి, అనంతపూరు, చిత్తూరు జిల్లాలను మాత్రము ఆంధ్రదేశముగ గ్రహించినాఁడను. ఈ పదునొకండు జిల్లాలును 78,442 చదరపు మైళ్ల వైశాల్యముగలవి. ఇందు అన్ని తెగలకు చెందిన 1,66,94,708 మంది ప్రజలు గలరు. ఇందలి యాంధ్రసోదరులకు వైద్యసాహాయ్య మెట్లు జరగుచున్నదియు విచారణీయము.

1915-వ సం॥పు నివేదిక యింతవరకు లభింపలేదు, వైద్యశాఖాధికారి ప్రకటించిన 1914-వ వత్సరపు నివేదిక ననుసరించి యీ క్రింది యంశములు వ్రాయుచున్నాఁడను.

ఆంధ్రదేశమునందు దొరతనమువారిచేతను, లోకల్ ఫండు మునిసిపల్ సంఘములు మిషనరీలు పోతీనువారు మొదలగు సంస్థలచేతను పోషింపఁబడు పాశ్చాత్యవైద్యశాలలు 222 గలవు.

పై వైద్యశాలలయందు ఐ. యం. ఎస్. ఆఫీసర్లు, సివిల్ అసిస్టెంటు సర్జనులు, సివిల్ అపాత్కరీలు, సబ్ అసిస్టెంటు సర్జనులు, లేడీ అపాత్కరీలు, లేడీ డాక్టర్లు, మొత్తమునకు అన్ని రకముల చికిత్సకులును 322 రుగలరు.

పై వైద్యశాలలయందు, వైద్యశాలలలో నుండియు బైటనుండి మందుకై వచ్చియు, సంవత్సర మాద్యంతము వైద్యసాహాయ్యము నందిన రోగులు 26,96,012 రు అని తెలియుచున్నది. రోగుల మొత్తమునకు మందులకై రు

1,70,115 లును, పథ్యోపచారములకై రు. 53,068 లును, వైద్యుల జీతములకై రు 3,34,812 లును, చిల్లర ఖర్చులకై రు. 66,787 లును, ఇండ్లకై రు. 1,91,821 లును, మొత్తముమీఁద వైద్యశాఖకై రు. 8.26,603 లు వ్యయపడినట్లు తెలియుచున్నది. ఈ ఖర్చు మొత్తము లో దొరతనమువారు జీతములు మొదలగువానికై రు. 1,62,983 లును, లోకల్ ఫండువారు రు. 4,40,037 లును, మ్యునిసిపల్ వారు రు. 1,51,405 లును, ధర్మాత్ములు రు. 28,249 లును ఇచ్చినట్లు తెలియుచున్నది.

ఈ యంకెలను బట్టిచూడ, రు. 8,26,6031 ల నుండి 26,96,042 రు రోగులు చికిత్సాసాహాయ్యమును పొందినట్లును, అందు రోగి యొకనికి రు 0-4-10⅓ లు ఖర్చుపడినట్లును గన్పట్టుచున్నది.

ఈ మొత్తము రూపాయిల ఖర్చులలో గమనింపఁ దగిన ముఖ్యవిషయములు కొన్ని గలవు. జీతములకై వ్యయమగు రు. 3,34,813 లును అల్పవేతనములను గ్ర హించు సివిల్ అసిస్టెంటు సర్జనులకుఁగాని సబు అసి

ర్సెంటు సర్జనులకుఁగాని ఖర్చుపడియుండవనుట స్పష్టము. ఇంత మొత్తము ఎట్లు ఖర్చుపడుచున్నదని యోచించిన, ఒకజిల్లాకు అధమము ఒక ఐ. యం. యస్. ఆఫీసరుండు టయు, ఆ యుద్యోగి నెలకు వెయ్యి లేక పదునైదు వందల రూపాయలకు తక్కువగాని జీతము గ్రహించు టయు సర్వజనవిదితము. ఏజిల్లాయందు వ్యయముతక్కువ కనఁబడునో అచ్చట ఐ. యం. యస్. ఆఫీసరు లేఁ డనుట స్పష్టము.

మందులకై రు. 1,70,115 ల ఖర్చు చూపఁబడినది వైద్యుల జీతములకై వ్యయ మగునంతటి మొత్తముకూడ మందుకై వ్యయపడునట్లగపడదు. ఈ విషయమై పాఠకు లకు వైద్యశాలలయందు వెలగల మంచిమందుల నిచ్చె దరా యను సంశయము పొడసూపకపోదు. ఇఁక పథ్య మునకై కనఁబడు రు. 53,068 ల సంఖ్యను జూచెదమా, ఈ శాలల చిల్లర ఖర్చులకై వ్యయపడుచు రు. 66,787 ల మొత్తమంతగూడ నగపడదు. మఱియు చికిత్సాసాహా య్యమును పొందిన రోగుల మొత్తము సంఖ్యను బట్టి

పథ్యాచరణమును యోచించినచో, పాశ్చాత్య పద్ధతి వైద్యులుకూడ మన ప్రాచీనవైద్యపద్ధతియందలి లంఘన చికిత్స నవలంబించిరా యను సంశయమును తోంపక మానదు.

ఈ పదునొకండు జిల్లాలయందును 222 వైద్యశాలలు గలవని తెలిపియుంటిని. ఈ వైద్యశాలలెట్లు పోషింపబడుచున్నదియు మనవారిలో ననేకులకు తెలిసియుండదు. వాని వివరములను వైద్యశాఖవారు ప్రచురించిన నివేదికయందలి లెక్కలనుండి సైన కనబఱచియుంటిని. అందులో వైద్యశాలలకై దొరతనమువారు జీతములకును గృహనిర్మాణములకును రు. 1,62,983 లు ఇచ్చియున్నారు. ఇందు కడప బళ్లారి నెల్లూరు జిల్లాలయందు వైద్యశాలలు కట్టుటకై యిచ్చిన రు. 1,25,913 లు పోను రు. 37,070 లు మాత్రమే దొరతనమువారు వైద్యసాహాయ్యమునకై యిచ్చినట్లు తెలియుచున్నది. ఈ యంకెలనుబట్టిచూడ, వైద్య సాహాయ్యమున లోకల్ ఫండువారు ప్రథమగణ్యులనియు, మ్యునిసిపాలిటీవారు

ద్వితీయులనియు తెలియుచున్నది. దొరతనమువారు చేయు సాహాయ్యమును చూతమా, వారి ఐ. యం. యస్. ఆఫీసర్ల రెండు నెలల జీతమునకైనను చాలనట్లగపడుచున్నది. పైన కనఁబఱుపఁబడిన వివరములనుండి వైద్యశాఖయందలి వ్యయమునకై వినియోగింపఁబడు ద్రవ్యము ఏయేశాఖలనుండి వచ్చుచున్నదియు విశదము కాఁగలదు.

పైవైద్యశాలలయందు కార్యములను నిర్వహించు చికిత్సకులు మాత్రము దాదాఁపు 322 రు గలరని తెలిసియుంటిని. జిల్లా ముఖ్యస్థానముల యందలి పెద్ద వైద్యశాలలలో ఐ. యం. యస్. ఆఫీసరు, సివిల్ అసిస్టెంటు సర్జను, సబు అసిస్టెంటు సర్జనులును ఉండుటకలదు, ఆయా జిల్లాల ప్రధానస్థానములనుండు అధికసంఖ్యాకులగు వైద్యులు పోను మిగిలినవారిలో, పలుమగ తాలూకా ఆసుపత్రులయందు, సామాన్య వైద్యుఁడనఁ బరగు ఒక ఆస్పటల్ అసిస్టెంటుమాత్రమేయుండును. దాదాపు డెబ్బదియెనిమిదివేల చదరపుమైళ్ల వైశాల్యమును, ఒక కోటి డెబ్బదిలక్షల ప్రజలనుగల యాంధ్రావనియందు,

చికిత్సనందిన రోగుల సంఖ్యనుబట్టి చూడ, దొరతనము వారిచే నియమితములగు వైద్యశాలలును వైద్యులునుకూడ చాలకుండుట స్పష్టము. ఇందలి జనసంఖ్యను బట్టియు, చికిత్సనందిన రోగుల మొత్తమునుబట్టియు చూడ, మొత్తము జనసంఖ్యలో ఏకదేశముకూడ ఆంగ్ల చికిత్సాసాహాయ్యమును పొందినట్లగపడదు.

పైఁగనఁబఱుపబడిన వైద్యుల సంఖ్యను బట్టియు ఆంధ్రదేశమందలి ప్రజల సంఖ్యనుబట్టియు వైద్యసాహాయ్యము ఎంతవఱకు లభించియుండునని యోచింప, దాదాఁపు **51,847** ప్రజలకు ఒక యాంగ్లవైద్యుఁడు చొప్పున చికిత్సా సాహాయ్యమును చేసినట్లు తేటపడుచున్నది. ఇందఱు జనులకు ఒక ఆస్పటల్ అసిస్టెంటు ఏరీతిని చికిత్సాసాహాయ్యము చేయఁగలఁడో యోచనీయము.

దొరతనమువారు నూతనముగ విధించిన "వైద్యకశాసనము" అమలులోనికి సంపూర్ణముగ రాకపూర్వమే యేఁబదివేలప్రజలకు ఒక ఆంగ్లవైద్యుఁడు చికిత్సాసాహాయ్యము చేయుట దుర్ఘటముగానుండ, వైద్యకశాసనము

సంపూర్ణముగ నమలులోనికి వచ్చిన పిదప, నిఁక నెట్లుం డునో చదువరులే యూహింపవలెను. ఈ శాసనవిధుల ననుసరించిన ఆంగ్లచికిత్సకుఁడు ఏఁబదివేల జనులు గల ఆయా గ్రామములలోఁ గాని వైద్యశాలయందుఁ గాని చికిత్సాసాహాయ్య మొనరించునా? అక్రమప్రసవములకు సహాయుఁ డగునా? దొమ్ములయందలి దెబ్బలకు సాక్ష్య ము వెళ్ళునా? మరణశాసనముల చేవ్రాలులు చేయునా? ఆగంతుక సందిగ్ధమరణముల శవచ్ఛేదము లొనరించునా? ఇట్టి వెన్ని కార్యములను నానాఁటు చేయఁగలఁడో యోచింపుఁడు. వాని విషయమంతయు ఆగా తాలూ కాలవారికిని పల్లెలవారికిని ఎల్లరకును విదితమే. పై గన బఱుపఁబడిన వివరములనుండి దొరతనమువా రొసఁగు చికిత్సా సాహాయ్యము మిక్కిలి స్వల్ప సంఖ్యాకులకే లభించుచుండుట విశదమగుచున్నది. దేశమందలి ఇతర ప్రజలు ఏ వైద్యవిధానముపై నాధారపడి యున్నారను విషయమును చర్చించుట యనవసరమైనను పాఠకమహాశ యుల బోధకై కొంత వివరించెదను.

పాశ్చాత్యవైద్యపద్ధతి కొలఁదికాలముగ మన భారత దేశమున వ్యాపించియున్నది. దీని వ్యాపనమునకై దొర తనమువారు ప్రతివత్సరమును కొన్ని కోట్ల ద్రవ్యమును వెచ్చించుచున్నారు. ప్రతిరాజధానిలోను వైద్యశాలలను కలాశాలలను స్థాపించి ఉత్తమవిద్యను గఱపుచున్నారు. అందు మనరాజధానిలో కడచిన డెబ్బదిసంవత్సరములుగ కలాశాలల స్థాపించియున్నారు. ఇందు నాఁటినుండి నేఁటివరకును బైలుపడిన పట్టభద్రులగు యం. డి. లు 15 రు. యం. బి, అండు సి. యం. లు 164 రు యల్. యం. అండు యస్. లు 398 రు. అని తెలియుచున్నది. డెబ్బదివత్సరముల కాలములో లెక్కకు ఉత్తమ వైద్యవిశారదులు కొందరె యగపడుచున్నారు. అందును మనయాంధ్రులు 10 మంది లేక 15 యుండవచ్చును. ఇందును ఆంధ్రులలో ఉత్తమోత్తమ బిరుదముగు, యం. డి. అను పట్టము లందినవా రొకరైనను లేకపోవుట చాల విచారకరము. ఇపుడిపుడు వైద్యకలాశాలలోచేరు ఆంధ్రయువకులు ఉత్తమతమ వైద్యపట్ట

ముల పొందుటకు ప్రయత్నము చేయవలెను. దేశము నానాట జనబాహుళ్యమున వృద్ధి నొందుచున్నది. వైద్యులు అల్పసంఖ్యాకులు. ఆంధ్రయువకు లనేక కలాశాలలయందుచేరి వైద్యవిద్య నభ్యసించుట యావసరము.

పైఁ గనఁబఱుపఁబడిన వైద్యులసంఖ్య అల్పమనియు వీరికై డెబ్బది వత్సరములుగ ఎన్నిలక్షల ద్రవ్యము ఖర్చు అయినదియు అందు ఒక్క వైద్యవిద్యార్థికై యెంత వ్యయ మగునదియు పాఠకులకు బోధపడఁగలదు.

పులింద తక్షక వారణాసి శ్రీశైలము అమరావతి, వీనియందు ప్రసిద్ధిగాంచిన ఆయుర్వేద విద్యాపీఠములును, వాని పరంపరలును, అందు ప్రసిద్ధిగాంచిన ఆయుర్వేద వేత్తలును, రాజావలంబనము లేకపోవుటచేతను ఇంకననేక కారణములచేతను క్రమముగ క్షీణింపఁదొడఁగెను. పై విద్యాపీఠములయందువలె బహుసంఖ్యాకు లగు విద్యార్థులు విద్య నభ్యసింపకున్నను, అచ్చటచ్చటఁగల ఆయుర్వేదవిదులు తమతమ శక్తుల ననుసరించి విద్యార్థులకు లక్ష్యలక్షణముల విద్యను గరపుచుండిరి. దేశీయ మహా

రాజులు రాజులు పరదేశపు వైద్యమును కారణాంతరములచే తమ రాజ్యములందు నెలకొల్పుకొని యున్నను సవతితల్లిమాదిరి ఆయుర్వేదమును కూడ క్రీగంటితో చూచుచువచ్చిరి. ఇందుచేతను, భారత భూమియందు మతాభినివేశము లుండుటచేతను, పాశ్చాత్య పద్ధతియందువలె మందులు చేయువారొకరు వానిని అమ్మువారొకరు వాని గుణాదుల నెఱింగి వినియోగించువారొకరు. గాక, మందులు చేయువారును వినియోగించువారును ఒకరే యగుటచేతను, త్రికాలవేదులగు మహర్షుల జ్ఞానతేజస్సుతో కూడిన మన యాయుర్వేదవైద్యము నభ్యసించిన యనేకులు అక్కడక్కడ నిలిచియుండిరి. ఆపరంపరలే లోకమున ఖ్యాతిగాంచిన కుటుంబములు. వారలే ప్రకృతము భారతభూమియం దంతటను వ్యాపించియున్నారు. వీరలలో కొందరు తమతమ పితృపితామహాదుల వల్ల లక్ష్యలక్షణముల విద్య నభ్యసించి పరంపరలను కాపాడుచున్నారు. మరికొందరు ప్రసిద్ధులగు వైద్యపుంగవులకడ కేగి కొన్నివత్సరములు గురుకులవాసము చేసి

లక్ష్యలక్షణముల నభ్యసించి తమ విజ్ఞానమును లోకమున వినియోగించుచున్నారు. ఇంక కొందరు తమ పూర్వులు వైద్యులనియు తా మా పరంపరలయందు జన్మించితి మనియు ఆ మాత్రముననే తాము వైద్యుల మనియు చెప్పుకొనుచున్నారు. పైం జేర్కొనంబడిన వారలుగాక కొందరు ఏవియో ఒకటిరెండు విషయములు(చిట్కాలు) తెలిసికొని అందువలన ఖ్యాతివడసి యున్నారు.

సిద్ధాంతితమగు విద్యాపీఠములు లేకపోవుటచేత ఏక ముఖమగు పాండిత్యముగల వైద్యులు అరుదై, బహుముఖములతోం జేరిన విజ్ఞానముగల వైద్యులును సామాన్యమగు జ్ఞానముగల వైద్యులును నున్నారు. జ్ఞానము అనంతము. అయ్యది దానిదాని సాధనములతో వేర్వేఱుగ నుండిన ట్లగపడినను ప్రక్రియాభాగమందలి ఫలమువొకము. దానంజేసి అందలి భేదములను విమర్శించుట యనవసరము. ఇట్టి వైద్యవిజ్ఞానముగల వైద్యులు మన యాంధ్రభూమిని అనేకులుగలరు. సామాన్యవిశేష జ్ఞానముగల యీ దేశీయవైద్యులే ప్రజా సామాన్యమునకు

ఆధారముగ నున్నారనుట నిర్వివాదము. మరియు భారత సామ్రాజ్య శాసనసభయందు ఈ నెల 15 వ తేదిని నూటికి తొంబది తొమ్మిదిమంది దేశీయవైద్యము మీఁదనే యాధారపడి యున్నారని చెప్పిన సర్ పాడిలూకిసుగారి అమృతవాక్యములే నిదర్శనములు.

కడచిన జనాభా లెక్కలనుండి యీ పదునొకండు జిల్లాలయందును, అన్నిరకముల వైద్యులును దాదాఁపు 19,350 మంది గలరని తెలియుచున్నది. వీరిసంఖ్యను ఆంధ్రదేశమందలి మొత్తము జనసంఖ్యనుబట్టిచూడఁగా, సుమారు ఎనిమిది వందల ముప్పదిమందికి ఒక దేశీయ వైద్యుఁడుగ తేలుచున్నది. ఇందును సామాన్య జ్ఞానము గలవారిని లెక్కింపక కొంత జ్ఞానముగలవారిని విడఁదీసినను, పై మొత్తము జనసంఖ్యలో ఎనిమిది వందలమందికి ఒకం దేశీయవైద్యుఁడు సాధారణముగ నేర్పడుచున్నాఁడు. దొరతనమువారి వైద్య సాహాయ్యమును వైద్యుల సంఖ్యను, దేశీయవైద్యుల సంఖ్యను దేశీయ వైద్యులు చేయు వైద్యసాహాయ్యమును విమర్శించిచూడ, పాతక

మహాశయులకు దేశమంతయు ఏవైద్యమున నాధారపడి యున్నదియు రెంటిలో నేది సులభసాధ్య మైనదియు హెచ్చువెచ్చము లేనిదియు విశేష ఫలప్రద మైనదియు వారివారి మతధర్మములను కాపాడునదియు ప్రత్యేకముగ తోచకమానదు.

తిరువాన్కూరు మైసూరు కొచ్చి రాజ్యములయందు రాజకీయ మగు గొప్ప కలాశాలలు వైద్యశాలలు స్థాపితములు. ఇందు ఆయుర్వేదము లక్ష్యలక్షణములఁ గఱపఁ బడును. మైసూరు కలాశాలయందు అనాటమీ ఫిజియాలజీలను కూడ నేర్పుదురు. ఈ కలాశాలలయందు త్తీర్ణతను గాంచిన విద్వద్వైద్యులను తమ రాజ్యమునఁ గల వైద్యశాలలయందు రాజకీయవైద్యులుగ నియమించియున్నారు. ఇట్టి వైద్యశాలలు తిరువాన్కూరు రాజ్యమున 72 కలవు. మైసూరు రాజ్యమున 27 ఆయుర్వేద వైద్యశాలలును 5 యూనానీ వైద్యశాలలును కలవు.

హైదరాబాదు రాజ్యమున నైజాము దొరతనము వారు యూనానీ కలాశాలలను స్థాపించినారు. ఇం

దుత్తీర్ణత గాంచిన వారిని తమ రాజ్యమున రాజకీయ వైద్యులుగ నియమించియున్నారు. ఇట్టి యూనానీ వైద్యశాలలు పెక్కులుగలవు.

చెన్నరాజధానియందు కీర్తిశేషులైన ఆనరబిల్ వి. కృష్ణస్వామయ్యర్. సి. యస్. ఐ. గారిచే స్థాపితమగు వైద్యపాఠశాల కలదు. ఇందు లక్ష్యలక్షణముల విద్య గఱపఁబడును. మరియు అనాటమీ ఫిజియలజీలను కూడ దేశభాషలలో బోధించెదరు.

నాచే పదునైదు వత్సరములుగ నొక ఆయుర్వేద కళాశాల నిర్వహింపఁబడుచుండుట యందఱికిని విదితము. దీనియందు పై కలాశాలలయందువలెఁ గాక కలకత్తా బొంబాయి బనారస్ జయపూరు మైసూరు మదరాస్ మొదలగు పట్టణములయందు ఖ్యాతిగాంచిన ఆయుర్వేదావతంసులును పాశ్చాత్యవైద్యవిశారదులును గలసి యేర్పడిన పరీక్షకసంఘముచే నియమితమగు పాఠ్యక్రమము ననుసరించిన బోధనాపద్ధతి గలదు. ఇందు పాశ్చాత్య వైద్యపద్ధతియందలి అనాటమీ ఫిజియలజీ కెమిస్ట్రి

క్షిజిస్సు మిడ్వైఫరీ మిడిసన్ వెటీరియా మెడికా ఫైజిక్సు మొదలగునవి కూడ దేశభాషలలోఁ గఱపఁబడును. «ఆయుర్వేదభూషణ» అను సంస్కృతశాఖతోపాటు «భిషగ్వర» అను ఆంధ్రశాఖయు కలదు. ఇంవు సంస్కృతశాఖయందు «ఆయుర్వేదభూషణ» బిరుదములు పొందినవారు లాహోర్ అజమీర్ కలకత్తా అనంతశయనము గద్వాల్ మంగళూరు మొదలగు భారతదేశముల నివాసము లేర్పరచుకొని వైద్యప్రచారము చేయుచున్నారు. ఒక కేరళీయ ఆయుర్వేదభూషణుఁడు ఎడింబరో మహానగరమున వైద్యశాఖయందు విద్యాభ్యాసము చేయుచున్నాఁడు. ఈ రెండు శాఖలయందును పట్టభద్రులైనవారు 32 రు గలరు. మొత్తమునకు నీ రెండుశాఖలయందును పట్టములు గ్రహించిన ఆంధ్రులు పదుగురు గలరు. ప్రకృతము కలాశాలయందు ఇరువది మంది యాంధ్రులు ఆయుర్వేదము నభ్యసించుచున్నారు. మన రాజధానియందు ఆంధ్రులు ఆయుర్వేదము నభ్యసించుటకును ఆంధ్రభాషయందు ఆయుర్వేదవిద్య గఱపుట

నను ఏర్పడిన ఆయుర్వేదకలాశాల యిది యొకటియే. మొత్తముమీఁద ఆయుర్వేద కలాశాల లన్నిటియందును బిరుదములు పొందిన విద్వద్వైద్యులు దాదాఁపు రెండు వందలమంది గలరు.

పైన వివరింపఁబడిన దానిని బట్టి దొరతనమువారు అనేక లక్షల రూప్యములు వెచ్చించి అల్పసంఖ్యాకులగు పాశ్చాత్య వైద్యులను సృష్టిచేయుటతోఁబాటు అల్పవ్యయముతో ఆయుర్వేద వైద్యులను వేలకొలఁది తర్ఫీతు చేయింపవచ్చునని చదువరులకు బోధపడక మానదు.

ఆంధ్ర దేశమందలి జనసంఖ్యనుబట్టి దొరతనము వారు చేయు వైద్యసాహాయ్యము " స్థూలారుంధతీ న్యాయము'' గ నున్నది. ఇయ్యదియే బహుజనుల కుపకరించు నట్లు దొరతనమువారిని కోరెదమేని పెద్దవైద్యులకు పెద్ద జీతములు లభించుట నిశ్చయము ; పేదలగు ప్రజలకు వైద్యసాహాయ్యము లేకపోవుటయు సత్యము దివారాత్రములు చెమటలూడ్చి కష్టపడి దమ్మిడి దమ్మిడి కూడఁ

బెట్టు రహితులచే క్వ్రెంటు తోడ్డుఘండుం మొదలగు రూపములల నియ్యఁబడిన లక్షలకొలఁది ధనము వ్యయము గుట నిక్కము; ఫలమో అల్పము. మీఁదు మిక్కిలి ప్రసవచికిత్సలయందుఁ గాని శస్త్రచికిత్సలయందుఁ గాని యే విశాఖపట్టణమునకో రాజమహేంద్ర వరమునకో జిల్లా పెద్ద ఆసుపత్రి గలదని వెళ్లిన అచ్చట అనుకూల మగు శస్త్రసముదాయము లే దనుటయు లేడీ డాక్టర్ లే దనుటయు ఈ శస్త్రచికిత్సకై చెన్నపురికి పొమ్మను టయుం సాధారణము.

ప్రతి జిల్లాయందును తాలూకాయందును గల జన సంఖ్యను బట్టి ప్రకృతము ఒకటి రెండు ఆయుర్వేద యూనానీ వైద్యశాలలను స్థాపింపవలెను. దీనికగుఖర్చు పాశ్చాత్య వైద్యశాలలకై వినియోగించు రీతిని, జిల్లా బోర్డు తాలూకా బోర్డులనుండి యియ్యవలెను. ఈ విష యమై జిల్లాబోర్డు తాలూకాబోర్డుల మెంబరులు తగు శ్రద్ధతో పనిచేయఁ బూనుట వారికివిధి. సామాన్యముగా

ఒక తాలూకాయందలి యింగ్లీషు వైద్యశాలకై వ్యయ మగు మొత్తముతో మూఁడు ఆయుర్వేద వైద్యశాలలను నిర్వహింపవచ్చును. మఱియు మందులకై బొంబాయి కలకత్తాలకు పోవలసిన పనిలేదు ; ఇంగ్లండునకు వ్రాయ నవసరములేదు. ప్రతిరోగమునకు శస్త్రవైద్య మవసరము లేదు. వైద్యులకు మాసమునకు వందలకొలఁది జీతము లియ్యఁబనిలేదు. మన దొడ్లయందును గ్రామములయం దును పుట్టిన మూలికలతో శీతోష్ణస్థితుల ననుసరించి యౌషధములను నిర్మించవచ్చును. వీని కగు ద్రవ్యము అల్పము.

మన దేశమున మనతోఁబాటు పుట్టిన మూలికాదు లచే చేయఁబడు మందులు మన శరీరమునకు హితమనుట నిజము. వీనిచే బహుజనుల కుపకారము కలుగుట లోక విదితము. ఇట్లు సర్వవిధముల అనుకూల్యములు గల ఆయు ర్వేద వైద్యశాలలను ప్రతిపల్లెయందును స్థాపించుటకు ప్రతివారును ప్రయత్నింపవలెను.

## ఒకనెల ఖర్చుల మదింపు.

| | | |
|---|---|---|
| ప్రతి రోజును రెండువందలమంది రోగులకు సామాన్యమగు మందుల ఖర్చు... | రు. | 40-0-0 |
| ఇద్దరు వైద్యులకు (40+30) | ,, | 70-0-0 |
| కంపౌండరు | ,, | 10-0-0 |
| రైటరు | ,, | 10-0-0 |
| ఇద్దరు మందులు చేయువారలకు | ,, | 15-0-0 |
| ఇంటి యద్దె | ,, | 15-0-0 |
| చిల్లర ఖర్చు | ,, | 10-0-0 |
| మొత్తము | ,, | 170-0-0 |

పై కనఁబఱుపఁబడిన ప్రకారము ఇన్నూరుమంది రోగులు వచ్చు ఆయుర్వేదవైద్యశాలను సామాన్యమగు మందుల నిచ్చి నెల 1-కి నూటడెబ్బది రూప్యములతో నిర్వహింపవచ్చును. దీనిని నా యిరువదియైదు వత్సరముల యనుభవముమీఁద వ్రాసినాఁడను. ఇట్టివాని వివరములను గోరువారలకు ప్రత్యుత్తరముల నిచ్చుటకు సిద్ధుఁ

డను. పాశ్చాత్య పద్ధతుల ననుసరించి యిన్నూరుమంది రోగులు ప్రతిదినము వచ్చు వైద్యశాలను నిర్వహింపవలె నన్న అందలి ప్రధాన వైద్యుని జీతమునకే మాసమాసమునకు ఇన్నూరురూపాయలు చాలవు. మిగిలిన వైద్యులకును ఇతర పరివారమునకును మందులు మొదలగువానికిని చేర్చి మాసమునకు ఎన్నివందలు కావలయునో పాఠక మహాశయులకు బోధకాఁగలదు.

ఆంధ్రమండలములకన్నిటికిని చేరిన ఆయుర్వేద కలాశాల యొకటి యవసరము. ఇందు ఆయుర్వేదవిద్యను లక్ష్యలక్షణములతో ఆంధ్రభాషయందు బోధింపవలెను. ఇందు జయము గాంచినవారినే ప్రతి జిల్లాయందును తాలూకాయందును పల్లెయందును వైద్యులుగ నియమింపవలెను. జిల్లా బోర్డులనుండి తాలూకా బోర్డులనుండి ధనమును వెచ్చించి వైద్యశాలల నేర్పఱుపవలెను. కళాశాలయందు జయముగాంచువారు విశేషముగ లేకున్న ఆయా ప్రాంతములలో ప్రసిద్ధిగాంచిన వైద్యులను నియమింపవలెను. ఇట్లు చేసినచో జన సామాన్యమునకును

అందును మిక్కిలి బీదలకును వైద్యసాహాయ్యము లభింపఁగలదు. ఆరోగ్యము అధికము కాఁగలదు. ప్రజలు సత్సంతతిని పొందఁగలరు. విద్యా బుద్ధులు వర్ధిల్లును. నాగార్జునాది కలావంతులచేతను అనేక మహిమలు కనఁగొనిన నవనాథసిద్ధులచేతను పరహితాచార్య నీలకంఠ వల్లభేంద్ర బసవరాజాదులగు వైద్యపుంగవులచేతను అలంకరింపఁబడిన ఆంధ్రదేశము అభివృద్ధి నొందును. ఆంధ్రమాత సంతసించును.

---

Printed at the Ayurvedic Printing Works, Madras.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు వారి

# జీవామృతము.

రక్తమును వృద్ధిజేయును, మేహవాత నొప్పులను బోగొట్టును, అన్నివిధములగు బలహీనములను అణచును, పాండురోగులకు మంచిది, గుండెదడను నివారణ జేయును, గర్భకోశరకములను దురుమును, బాలులకు గర్భిణీలకు సత్తువము, చనుబాలను వృద్ధిబరచును, ముసల్యలకు మంచిది, మెదడుకు బలమును గలుగజేయును, నరములకు శక్తిని హెచ్చించును, విద్యార్థులకు ప్రాణమిత్రము, ప్రాణశక్తిని హెచ్చించును, క్షయరోగులకు మిగులమంచిది, కాసరోగులకు అమృతము, గుండెకాయకు మిక్కిలిబలమునిచ్చును, ఊపిరితిత్తులకు అధిక బలము జేయును, ఉబ్బసరోగులకు మిగుల హితము.

వెల బుడ్డీ 1-కి రు. 3.

ప్యాకింగు పోస్టేజి వేరుగానివ్వవలెను.

ఆయుర్వేదాశ్రమం, 55, ఆచారప్ప వీధి, మదరాస్.

